## కేసరి రత్నత్రయము

## లోధ్ర

గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు బురుకోలు, బహిష్టి కాకుండుట, అకాలబహిష్టి, మైల జాస్తిగాను, తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతాన హీనత, రక్తహీనత, మలబద్ధకము, సూతికా వాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు, అరిచేతులు మంట మొదలగు స్త్రీ మర్మవ్యాధులను కుదుర్చును.

వెల 12 డో రు 3, 6 డో రు 1 10 0

## అమృత

రక్తశుద్ధి ద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధకము, అజీర్ణము, కీళ్లనొప్పులు, పోషకరహితము, మేహవ్రణములు, ముఖసంకోచములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును యిచ్చును

వెల 12 డో రు 3; 6 డో రు 1 10-0

## అర్క

జ్వర నివారిణి

వాత, పిత్త, కఫ, విషమ, శీత, సన్నిపాత, ఆగంతుకాది సమస్త జ్వరములను నివర్తించును

వెల 6 డో 2-8 0, 3 డో 1-8-0

1 డో 0-8 0

## కేసరికుటీరం

ఎగ్మూరు మద్రాసు

---

## డోంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుటవలన

బలహీనము

పోగొట్టును

బిడ్డలకు బలమునిచ్చి

సౌఖ్యము గలిగించును

ఒక బుడ్డివెల ౧ రూపాయి

పోస్టుఖర్చులు ౯ అణాలు.

ఎల్ల షాపులందు దొరకును

K T DONGRE &Co ,
GIRGAON, BOMBAY

---

## "వసంత" చెఱుకుయంత్రము

నిజమైన

రసము

తీయుటకు

గంటలకు 2200 పౌ చెఱుకు రసము తీయును

కావలసిన శక్తి 8 బి ఎచ్ పి

## కిర్లోస్కర్ బ్రదర్స్, లిమిటెడు,

కిర్లోస్కర్వాడి (సతారా జిల్లా)

---

ఋతువులననుసరించి వచ్చుజ్వరములు

## మలేరియా

మొదలయినవి

అమీన్సు ఆంటిమలేరియా బిళ్లలు వాడుటవలన త్వరితముగను, నమ్మకముగను తగ్గును క్వైనైన్ మొదలగు ఇతర ఔషధములు వాడినతరువాత కలుగు నష్టకరములు, దుర్గుణములేవియు ఈబిళ్లలవలన కలుగవు

వేలకొలది పురుషులు, స్త్రీలు, శిశువులు ఈబిళ్లలను ఉపయోగించి ఆరోగ్యమును పొందుచున్నారు హిందూదేశ మందంతటను డాక్టర్లు వీటిగుణములను కొనియాడుచున్నారు

జ్వరమువచ్చునప్పుడు మొట్టమొదట సూచన కనబడగనే

## అమీన్సు ఆంటిమలేరియాబిళ్లలు

తీసికొనుడు

అన్నిచోట్లలో దొరకును

## ఎ. అమీన్ అండ్ కంపెని.,

ఎక్సెల్సియర్ సినిమాబిల్డింగు హైదరాబాదు—దక్కన్

## A.AMIN & Co.,

Excelsior Cinema Building, Hyderabad-Decca

---

## రోగన్-ఏ-అమల

## హేరాయిల్

(Rougan E Amla Hair Oil)

వెంట్రుకలు పెరుగుటకు ఇది ప్రసిద్ధమైన హేరాయిలు సమ్మోహింప చేయునట్టి ఉత్తమమైన పరిమళము మేలురకపు కొబ్బరినూనెతో చేయబడినది గొప్పవారు రాజులు మహారాజులు ఒకతేడవాడిన దానియొక్క పరిమళమును మీరె గ్రహించ గలుగుదురు

వెల సీసాకు రూ 1-4-0

మేనేజరు టూహి-టూబా కంపెనీ

గౌలిగూడచమన్ హైదరాబాదు(దక్కన్)

---

భగవాన్‌లాల్ నారాయణ్‌జీ

అత్తరువ్యాపారులు

మచ్లీకమాన్, హైదరాబాదు

మావద్ద అన్నివిధములైన స్వదేశీఅత్తరు తైలములు, అగరువత్తీలు, గంధపుపొడి చాయ సబ్బులు జర్దా మొదలగునవి అమ్మబడును

---

## నవీన దంతములు!

## దంతవైద్యము!

మావద్ద అమెరికా దంతములు నూతన పద్ధతుల మీద సరసమైనధరకు తయారు చేయబడును జీవితకాలమువరకు గ్యారంటీ పండ్లనొప్పులు, పుచ్చులు, నోటి దుర్గంధములు అద్భుతముగా నివారింపబడును.

డాక్టర్ ఆర్ ఎస్ దుర్గయ్య, దంతవైద్యులు

దవాఖానా పిక్చరుహౌసుకు ఎదురుగా

సుల్తాన్ బజారు హైద్రాబాదుదక్కన్

---

## సీతారాం ప్రైవేట్

## ఇన్‌స్టిట్యూట్

6613 వెంకటేశ్వర గల్లీ సికింద్రాబాదు

మెట్రిక్యులేషన్ ఇంగ్లీషు తరగతులు ఉన్నవి ఆధునిక నూతన పద్ధతులలో త్వరగా నేర్పబడును ఫీజు స్వల్పము ఆభివృద్ధి ననుసరించి జీతముల వివరము

---

## పొకరేట్టు చక్కని

## మదరాసునగరములో హాఫ్‌టోను

## బ్లాకులు-రంగుబ్లాకులు-రబ్బరుస్టాంపులు

## తక్కువ ఖర్చుకు పేరొందిన

## పరిశ్రమాలయము రవిప్రాసెస్

7/34 ...

---

అలసించినచో ఆశాభంగము!

కాకినాడ సర్‌రికార్డ్సు కంపెనివారిచే

ఏర్పరచబడినవి

అపూర్వమగు తెలుగు డ్రామాసెట్టులు!

## ప్రమీలార్జున

6 రికార్డులసెట్టు వెల రూ 13 8-0

నేడే ఒకసెట్టుకొని ఆనందింపుడు!

## సీతాపహరణము

లేక

## పంచవటి

4 రికార్డులసెట్టు వెల 9 0 0

ఇవిగాక యింకను, అన్నివిధములగు రికార్డులు, అన్నిసంగీత వాద్యములకు ఒక్కసారి మావద్దకు దయచేయుడు

## కాళిదాసుబి ప్రోహిత్, సర్‌రికార్డు కంపెని సోల్ ఏజంటు

రెసిడెన్సీకోఠీవద్ద, హైద్రాబాదు-దక్కన్

# అయిదవ జార్జి సార్వభౌముడు కీర్తికాయుడగుట

## ప్రపంచమంతయు విషాద మగ్నమగుట

హైద్రాబాద్ (దక్కన్), ౨౧-౧-౧౯౩౬

### నగరమంతయు మూయబడుట

నగరమందలి వివిధ ప్రభుత్వ కార్యాలయముల పనిచేయు ఉద్యోగులు యథాప్రకారముగా నేడు ఉదయము ౯-౧౦ గంటలకు తమ తమ కార్యాలయములను చేరుకొనుసరికి ఐదవ జార్జి సార్వభౌముని మరణముచేత విషాద సూచకముగ కార్యాలయములు మూయబడినవను దుఃఖవార్తను వినవలసివచ్చెను. ౧౦ గంటలవరకు కార్యాలయములు చాలవరకు మూయబడెను. బల్దియా సర్కారువారివేగాక మాన్గిని కూడ మూయబడెను. అంతేకాదు దుకాణములు కూడ అనేకములు మూయబడినట్లు తెలిసినది. ఈ వార్త నిన్న అర్ధరాత్రివేళ ప్రభుత్వాధికారులకు టెలిఫోన్ ద్వారా తెలిసినదని అనుకున్నారు.

### జబ్బు ఏమి?

చక్రవర్తిగారికి జబ్బుచేసినట్లు ౧౭ జనవరి తేదిగల రూటరువార్తలు తెలియజేసియుండెను. కాని ఇపుడు యింతలో యింత స్థితి వచ్చునని అనుకొనలేదు. ఆవార్తలో సార్వభౌమునికి ఏదో జలుబు చేసినట్లును, అందుచేవారు సండ్రింఘములో తమగదిలోనే ఉండవలసి వచ్చినట్లును తెల్పెనుకాని, జబ్బు అంతభయపడదగినదికాదని వైద్యులు తలచుచున్నట్లు వ్రాసెను. ఇది మొదటవచ్చినవార్త. కాని ఆటు తర్వాతవచ్చినవార్త రోమ్ ప్రకటించెను, హృదయ దౌర్బల్యముచే బాధించుచున్నట్లును, అందుచే కొంచెము కలవరముగ నున్నట్లును అధికారులే తెల్పినట్లు వెల్లడించెను. కాని ఫ్రెడరిక్ విలియంస్, సర్ స్టెన్లీ హెవెట్, డాసన్ గార్లు తమ సంతకముతో నిచ్చినప్రకటన మాత్రము సార్వభౌముని గుండెపడినను అంత తీవ్రమైనదికాదని తెలిపెను.

ఇందు సర్ ఫ్రెడరిక్ గారు సండ్రింఘంలో చక్రవర్తిగారింటికై నియోజింపబడిన సర్జన్ అపోథికెరీ స్టెన్లీ హీవెట్ గారు ౧౯౧౪ నుండి చక్రవర్తిగారి సర్జన్ అపోథికెరీ. డాసన్ గారు చక్రవర్తిగారి సాధారణ వైద్యుడు. వీరలు సంతకము చేసిన ప్రకటన ౧౭ వ తేది అర్ధరాత్రివేళ వెడవలెను.

### కుమారుల రాక

సార్వభౌమునికి యిరువురు కుమారులు గలరు. ఒకరు "ప్రిన్స్ ఆఫ్ వేల్సు" వీరె యువరాజు గారు. ఇంకొకరు "డ్యూక్ ఆఫ్ యార్క్." వారిరువురును తండ్రిగారి అస్వస్థతను గూర్చివిని జనవరి ౧౭వ తేదినాటికే సండ్రింఘమునకు చేరుకొనిరి. రెండవకుమారుడు గురువారమునాటినుంచియే తండ్రిని కనిపెట్టుకొనియుండెను.



### జబ్బు కారణములు

సార్వభౌముని అనారోగ్యమునకు గల కారణములనుగూర్చి వారి ఆస్థానములోనివారు క్రిందివిధముగ నొక్కిచెప్పిరి —

సార్వభౌముని అస్వాస్థ్యము అకస్మికముగా, జలుబుపుట్టుటచే సంభవించినదికాదు ౧౯౨౮—౨౯ వ సం||రములో చక్రవర్తిగారొకసారి జబ్బుపడియుండిరి. అప్పటినుండియు వారు చాల నీరసముగనుండిరి. అందుచేత ఇతరులకంటె సులభముగా వారికి పడిసెము పట్టెను. వారి రజతోత్సవపు వేడుకలచే వారికి క్రొత్తశక్తి ఉత్సాహము కలిగినమాట నిజమే కాని, గడచిన నెలలో వారి ప్రియసోదరి వియోగముచే కలిగిన దుఃఖము దుర్భరమగుటచే వారి అస్వస్థత బలమయ్యెను.

### వేకువజామున

౧౯ వ తేదినాటి వేకువజామున ౦-౪౫ గంటలపుడు సార్వభౌముని స్థితిలో మార్పేమియు కనపడలేదు.

### ఉదయము

౧౯ వ తేది ఉదయము వైద్యులు చక్రవర్తిగారి అసాధారణ వైద్యులగు సర్ మారిస్ కాసిడీగారిని పిలిపించుటకు నిశ్చయించుకొనిరి. కాసిడీగారు హృదయకోశ సంబంధమగు అస్వస్థతను చికిత్సచేయుటలో చాల ప్రవీణులని ప్రసిద్ధి వారువెంటనే రైలులో సండ్రింఘమునకు ప్రయాణమైపోయిరి. వారు సండ్రింఘము చేరగనే వారితోడి వైద్యులతో ఆలోచించి అంతకుముందు రాత్రి ప్రకటించిన బులెటినులో వెల్లడిచేయబడిన భయము, ఆందోళన కలిగించుస్థితి అట్లేయున్నదని తెల్పిరి. ఈ వార్తాలముపై ౧౧ గం. ౧౫ ని.లకు కాసిడీగారు సంతకము చేసిరి. ౧౯ వ తేదిరాత్రిఅంతయు ముగ్గురు డాక్టర్లు ఎప్పుడుపిలిచిన అప్పుడు పలుకుటకై కన్నుమూయక కాచియుండిరి.

### కూతురిరాక

౧౯ వ తేది మధ్యాహ్నమునకు రాజకుమారి ప్రిన్సెస్ మేరీగారు సండ్రింఘమునకు చేరిరి. ఆరోజు "డ్యూక్ ఆఫ్ యార్కు" గారి చిన్నపిల్లలిద్దరు సండ్రింఘమునుండి లండనుకు వెళ్లిపోయిరి. ఒకమూల డాక్టర్లు అదుర్దాపడుచున్నను ఆచిన్నపిల్లలిద్దరు ఆస్థానముఎదుట మంచు బొమ్మలతో అరగంటసేపు ఆడుకొనిరి

### నిద్రమాత్రము సుఖమైనది

గుండె బలహీనముగా నున్నను ౧౯వ తేది నాటిరాత్రి సుఖముగానే నిద్రించిరట.

### చికిత్స

౧౮వ తేది శనివారము చక్రవర్తిగారి శరీరములోనికి ప్రాణవాయువు నెక్కించిరట. దీనికి మునుపోయిన కొలది సంవత్సరములలో కూడ చక్రవర్తిగారికి జబ్బుచేసినపుడిట్లే చేయబడుచుండెడిదట

### ౧౯ వ తేది రాత్రి ౧౦ గం|| వేళ

౧౯ వ తేది రాత్రి ౧౦ గంట||వేళ కూడ చక్రవర్తిగారి స్థితిలో మార్పేమియు లేకుండెననియు, యింకమరల తెల్లవారువరకు యెట్టి ప్రకటనయు అధికారరీత్యా చేయబడదనియు ౧౯ వ తేదినాటి రూటరువార్త తెలిపెను.

### కాసిడేగారు వెళ్లిపోవుట

సర్ మారిస్ కాసిడేగారు సండ్రింఘము నుండి ౧౯ వ తేది మధ్యాహ్నమే వెళ్లిపోయిరి.

### కూతురి విచారము

రాజకుమారి ప్రిన్సెస్ మేరీగారు సండ్రింఘమునకు యార్కుషైరునుండి పిలిపించబడి చేరగానే రాణితోను రాకుమారులతోను చక్రవర్తిగారి స్థితినిగూర్చి వివరములన్నియు అడిగి తెలిసికొనెను.

### విగ్రాందంపతుల రాక

విగ్రాం ప్రభువుగారును వారి సతీమణియు కూడ ౧౯ వ తేది మధ్యాహ్నమునకు లండను నుండి సండ్రింఘము చేరుకొనిరి.

### ఫిలిం ప్రదర్శనమాగుట

చక్రవర్తిగారు తమ అతిథులకై ఫిలిం ప్రదర్శనము నొకదానిని, షికారిని ౧౭ వ తేది ఏర్పాటుచేసియుండిరి. కాని ౧౯ వ తేదినాటికి ఆందోళన పరిస్థితులుదయించుటచే ఆ ప్రయత్నమంతయు వదలివేయబడెను.

### సామ్రాజ్యమంతటను ప్రార్థనలు

బ్రిటిషు సామ్రాజ్యమంతటను చర్చిలలో ౧౯ వ తేది సార్వభౌముని ఆరోగ్యమునకై ప్రార్థనలు చేయబడెను.

### ప్రపంచమంతటను విచారము

జార్జిచక్రవర్తిగారిజబ్బు ప్రపంచములో అన్నిదేశములలోను విచారము కలిగించినట్లు రూటరువార్తలు తెల్పినవి. జర్మనీముఖ్యపట్టణమగు బెర్లినులో పత్రికలు చక్రవర్తిగారి అస్వస్థతను ప్రకటించి వారిగుణములను చాలప్రశంసించినవి. న్యూయార్కు (అమెరికాముఖ్యపట్టణము) వీధిలో ప్రతివారును, జార్జిచక్రవర్తిగారి జబ్బునుగూర్చి మాట్లాడువారె. పత్రికలు చక్రవర్తిగారి పెద్దపెద్ద ఫోటోబ్లాకు పటములతో నిండియుండెను. ఇటలీదేశ ముఖ్యపట్టణమగు రోమునగరములో పత్రికలు విచారము తెల్పుచు తమకెన్నడును చక్రవర్తిగారివంశముయెడ ద్వేషమేలేదని వెలిబుచ్చినవి

### హిట్లరుగారి సానుభూతి

జర్మని డిక్టేటరుఅగు హెర్ హిట్లర్ గారు చక్రవర్తిగారు త్వరగా జబ్బునుండి తేరుకొనవలసినదని తానుఆశించుచున్నట్లు చక్రవర్తిగారికితంతికొట్టిరి.

### ఫ్రెంచి ప్రెసిడెంటుగారి ఆదుర్దా

ఫ్రెంచిప్రెసిడెంటుఅగు లీబ్రన్ గారు చక్రవర్తిగారి ఆరోగ్యమునుగూర్చి ఎప్పటికప్పుడు విచారించి తెలిసికొనుచుండవలసినదని లండనులో ఫ్రెంచిఅంబాసెడరును కోరిరి

౨౦ జనవరి

౬-౩౦ వరకు దేహస్థితిలో ఏమి మార్పుకలుగలేదని ప్రభుత్వప్రకటన తెల్పుచున్నది. రాత్రికిముగ్గురుడాక్టర్లు హాజరినిచ్చుచుండిరి.

౯-౧౦ రాత్రి ప్రకటించిన ఆరోగ్యపత్రము వల్లజనములో కలవరము హెచ్చినది.

అందు హృదయచలనములో కొద్దిమార్పు కలిగినదనియుండెను. ఈప్రకటన సర్ మారిస్ కాసిడీఅను డాక్టరు హృదయరోగముల స్పెషలిస్టు గావించిరి.

డాక్టర్లు, సిస్టరుబ్లాకు, సిస్టరుడెవిస్ అను ప్రత్యేకనర్సులుగూడా చక్రవర్తిగారి ఉపచారములో మగ్నులైయున్నారు.

### ప్రిన్స్ఆఫ్ వేల్సు

ప్రిన్స్ఆఫ్ వేల్సు, డ్యూకుఆఫ్ యార్కు డౌనింగ్ స్ట్రీటు నం, ౧౦ లో ప్రధానమంత్రియగు బాల్డ్విన్ తో కలిసికొనిరి.

ఆర్చ్ బిషప్ ఆఫ్ క్యాంటర్బరి సెండరింఘం నుండి వెడలెను. ఆదివారమురోజు అన్నిచర్చిలలో చక్రవర్తిగారి ఆయురారోగ్యములకై ప్రార్థనలు సలుపబడెను.

### జ్యూలప్రార్థన

ఇంగ్లాండులోని జ్యూలందరు చక్రవర్తిగారి ఆయురారోగ్యములకై ప్రార్థనలుసలిపిరి.

కలకత్తా చర్చిలలోకూడా చక్రవర్తిగారి ఆరోగ్యముకై ప్రార్థనలు సలుపబడెను.

౨౦ జనవరి

౬-౩౦ వరకు ఆరోగ్య క్రమము ప్రకటింపబడి యుండెను. డాక్టర్లు పరీక్ష చేయుటకుగూడా వీలులేకుండెను. అనగా విశ్రాంతితీసికొనుచుండిరి.

౭-౧౫ వరకును ఏసంగతి తెలుపబడకుండ సమానముగ విశ్రాంతితీసికొను చున్నారని తెలుపబడెను.

౭-౧౭ న చేసిన ప్రకటనవల్ల చక్రవర్తిగారి అంత్యదినము గడచినని తేలినది.

### అందరుఅక్కడనే

ఆరోజు రాత్రిసాంతము రాణి రాజకుటుంబీకులు సండరింఘంలోనేయుండిరి,

డ్యూకుఆఫ్ క్యాంటుగూడా రానుండెను.

### వెస్టుమిన్స్టరులో ప్రార్థనలు

పైచర్చిలో దైవప్రార్థన కాగానే ఒకనిమిషముఅంతా నిశ్శబ్దముగా నుండెను. అంత చక్రవర్తిగారి ఆరోగ్యముకై ప్రార్థనలుసలుపబడెను.

### ఉస్మానియా విశ్వవిద్యాలయము

ఉస్మానియా విశ్వవిద్యాలయము నేడు తెరువబడగానే విచార సభ సమావేశమయ్యెను. విద్యార్థులును, ఉపాధ్యాయులును విషాదపూరిత హృదయములతో నుండిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులగు డాక్టరు మెకెంజిగారు సార్వభౌముల మరణవార్తను తెలుపుచు తమసంతాపమును వెలిబుచ్చిరి. విద్యార్థులును, ఉపాధ్యాయులును లేచి నిలువబడి తమ విచారమును వెలిబుచ్చిరి.

౬ వ పేజి చూడుడు

## గమనిక

జార్జిచక్రవర్తిగారి నిర్యాణము వలన మేము తక్కువపుటలతో ముందుగా ఈఅసాధారణ సంచికను వెడలించి గురువారమునాడుపత్రికను ఆపివేయించినాము. బుధ గురువారములందు మా కార్యాలయము మూసియుంచబడును.

— వ్యవస్థాపకుడు


# గోలకొండపత్రిక

యువనామ సం॥ పుష్య బ॥ ౧౩

బుధవారము


## సార్వభౌముని నిర్యాణము

"హీజ్ మెజస్టీ" అయిదవజార్జి సార్వభౌముని నిర్యాణము ప్రపంచమున అన్ని రాజ్యములకును విషాదమును కలిగించగలదు. గతమేనెలలో జరిగియుండిన వారిరజతోత్సవ వైభవములు ఇంకను స్మృతిపథమునుండి దాటిపోకముందే, ఇట్టివిషాద వార్త వినవలసివచ్చుట ఎంత దురదృష్టము! వారివయస్సును (౭౦ సం. ములు) బట్టి వారిమరణము అకాలమరణమని చెప్పవీలులేకున్నను, నేట్రిపపంచ పరిస్థితులనుబట్టి చూచినచో వారినిర్యాణమువలన బ్రిటిషురాజ్యమునకుగొప్పలోటు ఏర్పడినదని దుఃఖించవలసియున్నది.

నేడు ప్రపంచములో ఎటుజూచినను శాంతికి భయంకరములగు పరిస్థితులేర్పడియున్నవి. ఇటలీ అబిసీనియాల యుద్ధమునకు సంబంధించిన చర్యలన్నియు, యిరోపా సంగ్రామమును మాత్రమేగాక గొప్ప ప్రపంచ సంగ్రామమును తెచ్చిపెట్టునేమో యని ఏదిక్కుసుజూచినను ఆందోళనయే కనిపించుచున్నది. ఏకారణముల చేతనైననేమి గ్రేటుబ్రిటన్ రాజ్యము ఇటలీ అబిసీనియా వివాదములో అబిసీనియా పక్షమునే ఎక్కువగ సమర్థించుటకు పూనుకొని యుండుటచే ముఖ్యముగా యిటలీ బ్రిటనుపై మండిపడుచున్నది. ఈ సంఘర్షణలో ఇటలీ అబిసీనియాను వదలి మధ్యధరా సముద్రములో బ్రిటనుతో యుద్ధమునకు దిగినను ఆశ్చర్యకరముకాదని యిప్పటికే అనుకొన బడుచున్నది ఇట్టి భయంకర స్థితిలో తమరాజ్యమును తాము సింహాసనమెక్కినది మొదలు అనేక కష్టములను దాటునట్లుచూచి, దీర్ఘకాల మనుభవమును సంపాదించిన జార్జిసార్వభౌమునివంటి వివేకవంతుని సలహాయు, శ్రద్ధయు, బ్రిటను దేశమును సరియైన మార్గమున నడిపించుటకు ఎంతయు అవసరమని అంగీకరించక తప్పదు. కాబట్టి, ముఖ్యముగా ఈ సమయమున చక్రవర్తిగారి మరణము బ్రిటనుదేశమున కత్యధికవిషాదమును కలిగించగలదు.

ఆంగ్లరాజ్యాంగ సంప్రదాయానుసారము, ఆదేశపు ప్రభుత్వ వ్యవహారమంతయు పార్లమెంటుసభ్యులగు ప్రజా ప్రతినిధులలో అధికసంఖ్యాకుల రాజకీయపక్ష నాయకుల చేతులలో నుండును. ఆనాయకులే ముఖ్యులగు మంత్రులగుదురు. సార్వభౌముడు వారి కార్యవిధానముపై సంతకముపెట్టుటతప్ప మరే విధమైన అధికారమును చెలాయించజాలడు. కాని యింతమాత్రమున చక్రవర్తిగారికి బ్రిటిషుదేశ రాజ్యాంగములో స్థానమే లేదనిచెప్పుట పొరపాటు. బ్రిటిషుదేశ రాజ్యాంగ సంప్రదాయ ప్రకారము సార్వభౌమునికి ఉద్యోగులను నియోజించుట మున్నగు విషయములయందు నిరంకుశ స్వామ్యమునకు అధికార దుర్వినియోగమునకు గల అవకాశములు తప్పినవే గాని, నిజమైనతండ్రివలె సలహాలనిచ్చుటకుగల అవకాశము యింకను వృద్ధియైనదని దగ్గరపరిచయ గలవారే అంగీకరించియున్నారు. దేశమునంతయు కలవరపెట్టు విషయములు వచ్చినపుడు జార్జి సార్వభౌముని వివేకపూరితమైనసలహాగైకొననిదే యెట్టికార్యక్రమమును గాని ప్రారంభించ బడదు. అంతేకాదు; తనకధికారము--రాజ్యాంగ శాసన ప్రకారముకాదు, సంప్రదాయానుసారము—లేమిగదాయని చక్రవర్తిగారు అవసరమని తోచినపుడు యివ్వదలచుకొనిన సలహాను స్పష్టముగా యిచ్చుటకు సంకోచించి యుండలేదు. ఈసలహాలు ప్రజలచే యెన్నుకొనబడిన మంత్రులకు వారినిర్ణయములలో తోడ్పడియుండక పోలేదు.

వాస్తవములో ఐదవజార్జిగారి విద్యయు, విజ్ఞానమును, వివేకమును, మాతృదేశ భక్తియు, నిరాడంబరత్వమును ప్రపంచమునందలి అన్ని రాజ్యములందును ప్రశంసాపాత్రములైనవి. తుదకు భారతదేశపు కాంగ్రెసునాయకులుకూడ ఈఅభిప్రాయములో భేదము చూపరనిమా నమ్మకము. వారు వారి బాల్యమునందు విధికృత్యములందు శ్రద్ధ, నిరాడంబరత్వము మున్నగుసద్వర్తనము నందుసునిశితశిక్షణముపొందియుండిరి. అట్టిశిక్షణమునే తమకుమారులకు కూడ ఒసగుటలో మంచిశ్రద్ధవహించిరి. వారి కుమారులు చక్కగావిద్యనభ్యసించి పరిపక్వవయోబుద్ధులగునంతవరకు వారికి తాము రాజకుమారులమని గర్వించు అవకాశములేకుండ చేసియుండిరట. అట్టియువరాజుగారు రాజు కాబోవుచుండుట విషాద భారమును కొంత తగ్గించవచ్చును.

ఈ విధముగసార్వభౌముని సత్కీర్తి సద్గుణములు ప్రపంచమునందు అధికభాగము నాక్రమించియున్న క్రైస్తవరాజ్యముల అనురాగములను వారికి సంపాదించినవి. ఫ్రాన్సు, గ్రీసు, ఇటలీ, స్పెయిను, అమెరికామున్నగు అనేకరాజ్యములకును బ్రిటనుకును చారిత్రిక దృష్టిలోగల పాచీనబాంధవ్యసంబంధములు కొంతవరకు వారినిగూర్చి యితరదేశముల ఆదరమునకు కారణములైనను, విశేషముగ వ్యక్తితః జార్జిగారి గొప్పసుగుణములును, రాజకీయములన్నిటిని మించినిష్పక్షపాతియై యుండుటయు వారి యెడఐరోపీయరాజ్యములయొక్కయే గాక ప్రాచ్యరాజ్యముల యొక్కయు గౌరవము నాకర్షించినవి. కనుక వారి మరణము ప్రపంచమందన్ని దేశములకును వేడి నిట్టూర్పు వెడలచేయుట తథ్యము.

---

౫ వ పేజి తరువాయి

### సందేశములు

ఆపోపిరుపెడు ప్రెసి వారికి చక్రవర్తిగారి సందేశము తెన్నియో తంతి ద్వారా చేయున్నవి.

ఇటాలిరాజుగారు తన రాయబారియగు సీన్యరు గాండిద్వారా చక్రవర్తి ఆరోగ్య స్థితిని కనుకొని తనకుఇచ్చుట తెలుపగోరెను. ఇటులనే, జపాను, బెల్జియం, రొమేనియా ఇటులనే సందేశములనంపిరి.

రాత్రి అస్వస్థతగా నుండిరి.

౨౦ జనవరి

పగలు ౨గంటల వార్తవలన, విశ్రాంతితీసికొనుచున్న సంగతి తెలిసినది.

అనారోగ్యము పొడిగించిన రాజ్యభారము వహించుటకు ప్రివికౌన్సిలు సభ పిలువబడెను చక్రవర్తిగారు అధ్యక్షత వహింతురు. ఇందు, ప్రిన్సుఆఫువేల్సు, డ్యూకుఆఫుయార్కు లార్డువగ్రాంమెంబర్సు వారు పాల్గొనెదరు

లండను: జనవరి ౨౦

నేడురాత్రి ౧౧-౫౫ గంటలకు శ్రీజార్జిసార్వభౌములు సండ్రింగుహాంనందు దివంగతులైరి. వీరిమరణసమయమున మేరీ ప్రభ్వియు, ప్రిన్సుఆఫ్ వేల్సు, డ్యూకు ఆఫుయార్కు డ్యూకు రాజకుమారులుండిరి.

చక్రవర్తిగారి అవసానవృత్తాంతము ప్రధాన మంత్రులగు బాల్డ్విను గారికి, యితరమంత్రులకు టెలిఫోనుద్వారా తెలుపబడెను. మంత్రులందరును వెంటనే విచ్చేసిరి, విచారసాగరమున మునిగియున్న మంత్రులు రాజభవనము అంగణమున టోపీలులేక నిలిచియుండిరి.

చక్రవర్తిగారి మరణవార్త చిచ్చువలె వ్యాపించెను. ప్రజలధికసంఖ్యయందు రాజభవనము ముందు వ్యాకులతతో వచ్చిచేరిరి. స్త్రీలు చక్రవర్తి మరణమునకై విలపించుచుండిరి.

[స్వకీయవిలేఖరి]

హైదరాబాదు: జనవరి ౨౧

నేటిఉదయము ౫గంటలకు రెసిడెన్సి అధికారులకు జార్జిసార్వభౌములు రాత్రి౧౧-౫౫ గంటలకు కీర్తిశేషులైరను విషాదవార్త చేరను. రెసిడెన్సి అధికారులు నైజాంప్రభుత్వమువారికి వెంటనే యీవార్తను పంపుకొనిరి. రెసిడెన్సీ భవనమునందును, ఇంపీరియల్ బ్యాంకు, పోస్టాఫీసు మొదలగుస్థలములందు విషాద సూచకముగా యూనియన్ జాకు పతాకము సగమువరకు వంపబడెను

సార్వభౌముల మరణ విషాదవార్త చిచ్చువలె నగరమందంతటను వ్యాపించెను. ప్రభుత్వకార్యాలయములకును, పాఠశాలలును విషాద సూచకముగా మూయబడెను.

తరువాత విశ్వవిద్యాలయము మూయబడెను.

### ప్రభుత్వకార్య నిర్వాహకసభ

నేడు ఉదయము ప్రభుత్వకార్య నిర్వాహక అసాధారణసభ హిజు ఎక్సలెన్సి మహారాజా సర్ కృష్ణప్రసాదు బహదురు గారియాజమాన్యయిన సమావేశమయ్యెను. సార్వభౌముల మరణమునకై సంతాపము తెలిపుచు తీర్మాన మంగీకరింప బడెను. శ్రీనిజాం ప్రభువుగారి రజతోత్సవము విషయకచర్చ జరిగిరజతోత్సవము మార్చుటకు నిర్ణయింప బడెనని తెలియుచున్నది.

ప్రభుత్వ ప్రచురణశాఖ వారు నేడుసాయంత్రమువరకు ప్రకటన గావింప నున్నారు. అసాధారణగెజెటు ప్రకటింప బడనున్నది. శ్రీనిజాం ప్రభువుగారు సార్వభౌముల మరణమునకు సంతాపమును తెలుపుచు ఫర్మానును ప్రకటించెదరని తలపబడుచున్నది.

సికిందరాబాదు: జనవరి ౨౧

సార్వభౌముని నిర్యాణ వృత్తాంతము నగరవాసులందు ౧౦ గంటలవరకు వ్యాపించెను విషాదమును తెలుపుచు ప్రభుత్వ కార్యాలయములు, పాఠశాలలు మూయబడెను. దుకాణములన్నియును మూయబడెను.

## ప్రిన్సుఆఫ్ వేల్సుగారు రాజ్యాభిషిక్తుడగుట

ప్రిన్సుఆఫ్ వేల్సు యువరాజుగారు సింహాసనమున రాజ్యాభిషిక్తులైరని తెలిసినది.

## ౫౦ వేలుమదీనాకు

### ప్రభువుగారి ఫర్మాను

మదీనాలో విద్యుచ్ఛక్తి నెలకొల్పు మొదలగుపనులకై నేను నా పిల్వరుజూబిలీ చందాలనుండి ౫౦వేలు ప్రత్యేకించుటకు ఆజ్ఞ యొసంగినాను. త్వరలో ఈపవిత్రమైన పని విషయము పూర్తికాగలదని ఆశించుచున్నాను. గవర్నమెంటుచే నియమించబడిన కమిటి ఆపని చేయగలదు.

### రెసిడెన్సి ప్రభుత్వముతో మొఱ

సికిందరాబాద అల్లరుల సందర్భమున మహమ్మదు ఇస్మాయిలును చంపిన నేరమున ఫకీరాను మరణశిక్ష విధింపబడి యుండెనుగదా; ఇపుడాతడు రెసిడెన్సి ప్రభుత్వమును దయచేయుమని విన్నవించుకొనుచు, ఆ విన్నపము మంజూరగువరకు మరణ శిక్ష ఆపవలయునని వేడుకొనెను.

## నిజాం రాష్ట్రములో పసుపువాన

### ప్రజలలో భీతావహము

వరిపల్లి స్టేషనుకు ప్రక్కగ నాల్గునగర ప్రాంతములలో పదునైదుదినములనుండి విడిచివిడిచి పసుపుచినుకులు రాలుచున్నవి. ఈఅద్భుత దృశ్యము ప్రజలను భయపరచుచున్నది. ఎండవేడిమి అధికముగ లేకున్నను, మేఘములు అసలేలేకున్నను పెద్దపెద్ద పసుపుచినుకులు పడుచున్నవి. భూమిపైపడినవీవి ఎండిపోయి, అసలమున పసుపువన్నెగల వస్తువు కనబడుచున్నది. దానికి వాసనలేదు. ఈవిపరీతమునకు కారణము తెలియకున్నది;

### క్రికెట్టు ఆటగాండ్రు

ఆస్ట్రేలియన్ క్రికెట్టుజట్టుతో మొఘలు క్లా ౧౧ పక్షమున పోటీ సలుపుటకై వేరేస్థలములనుంచి వచ్చు ఆటగాండ్రు బషీరుబాగులో విడియుదురు. ఇక ఆస్ట్రేలియన్ జట్టుగూడా నవాబుగారి ఆతిథ్యమున సికిందరాబాదు పర్సి హోటలులో విడియుదురు.

# ఆంధ్ర ఇన్షూరెన్సు కంపెనీ (లిమిటెడ్)

హెడ్ ఆఫీసు: మచిలీపట్నము

స్థాపితము 1925

గమనింపుడు — వయస్సుకు మించిన అభివృద్ధి — గమనింపుడు

| | | |
|---|---|---|
| సాలీనా ఆదాయము | సుమారు | 5,00,000 |
| భీమానిధి | ” | 11,50,000 |
| అమలులో నున్న వ్యాపారము | ” | 1,00,00,000 |

దినదినాభివృద్ధి గాంచుచున్న ఈసంస్థలోనే
మీ జీవితములను వెంటనే భీమా చేయుడు.

వివరములకు

జి. జగన్నాథం
చీఫ్ ఏజంటు, నిజాంరాష్ట్రము,
నం. 3 జీరా సికింద్రాబాద్

యఱ్ఱమిల్లి మంగయ్య, బి. ఏ., బి. ఎల్.
కార్యదర్శి.




# మనోహర టాకీసు

రైల్వేస్టేషను సమీపమున సికింద్రాబాదు

ది ౩౦ జనవరి ౧౯౩౬ నుండి మొదలు

వేల్ పిక్చర్సువారి

# శ్రీ కృష్ణ లీల

ఇంతవరకు తెలుగుమాట్లాడు ఫిలిము లన్నిటిలోను గొప్పది.

రెండు గొప్ప తెలుగుఫిలుములగు “సావిత్రి”, “లవకుశ”లలోని ప్రధాన నటీనటకులను గొప్ప ఖ్యాతిచెందినయితర ఆంధ్ర నటీనటకులతో చేర్చి తీసిన ఫిలిం.

ఇందలి ప్రధాన పాత్రలు:—

ఇంత పేరెన్నికగనిన వారింతమంది యింతకుముందెన్నడును ఒక్కఫిలింలోనైనా నటించలేదు.

(1) * వేమూరు గగ్గయ్య ( “సావిత్రి” లోని కథానాయకుడు)
(2) * మిస్ రామతిలకం ( “సావిత్రి” లోని కథానాయిక )
(3) * పి. సుబ్బారావు ( “లవకుశ” లోని రాముడు )
(4) * మిస్. శ్రీరంజని ( “లవకుశ” లోని సీత )
(5) * పి.సత్యనారాయణ
(6) * మాష్టర్ సుబ్బారావు ( 5 ఏండ్ల నటకుడు )
(7) * శ్రీ రాజేశ్వరరావు

టాకీ లోకమునకు నిదివరకు గానరాని మహత్తరమైన తెలుగుటాకీ- మైమరపించు మధురసంగీతము- మనసు కదిలించుమనోజ్ఞ ఘట్టములు-రిచ్చపాటొదవించుతంత్రములు- మహత్తరమగు సెట్టింగులు-కడుపుబ్బనవ్వించు హాస్యములు- బహ్వాలోమ్భుత సన్నివేశముల భ్రాంతిపరచు ఫిలిము- మధురగానతరంగముల మిమ్ము మైమరపించుఫిలిము- ఆమూలాగ్రము, మిమ్మాకర్షించి ఆనందముగులజేయు ఫిలిము- మహత్తరపౌరాణిక చిత్రము. శ్రీకృష్ణలీలలు-నిరీక్షింపుడు! దర్శించి ఆనందింపుడు. ఆశాభంగమునందకుడు!!

# వేములవాడలోని చిత్రములు

మొదటిపేజి తరువాయి

త్సరములనుండి స్వామివారిసన్నిధిన ప్రతిదినసము ముప్పైమంది బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకు భోజనముపెట్టుటకు ఏర్పాటు గావింపబడినది. ఇటుల ఏర్పాటుగావించినవారు కేవలము శ్రీయుత గుండేరావు మొఖతేమదుగారు. నేను అక్కడికివెళ్ళినప్పుడు మొఖతేమదుగారు అక్కడనేయుండిరి. వారు స్వామివారిసన్నిధ భోజనశాలలో మా అందరికి భోజనమునేర్పాటుగావించిరి. ఇందుకునేము కృతజ్ఞులము. అక్కడ ప్రతిదినము గావింపబడిన భోజనమేర్పాటులకై గుండేరావుగారు శ్లాఘనీయులు.

ఈసందర్భమున దేవాలయములోనుండు ఒకవిచిత్రమును ప్రకటించకతప్పదు దేవాలయములో సింహద్వారముకడ ఒక మహమ్మదీయ భక్తునిగోరి (సమాధి)కలదు. ఈగోరి చాలాకాలమునుండి అచ్చటనున్నాదని పూజారులవలన వినియున్నాను. పాఠకులు దేవాలయము మొదటిదియా లేక గోరీయాయని విచారింపనవసరములేదు. ఎందుకనగా దేవాలయము సనాతనమైనదని అచ్చటఉండే బౌద్ధుల విగ్రహములనుండి మరియు బౌద్ధభాషలో లిఖింపబడిన శాసనములవలన తేటపడుచున్నది. ఆకాలములో భరతఖండమందు ముఖ్యముగా దక్షిణదేశమందు మహమ్మదీయులులేకుండిరని చెప్పవచ్చును. ఇక్కడ గోరి ఏర్పాటుఅయి రెండుమూడువందల సంవత్సరములుజరిగినవని వినియున్నాడను. ఈమహాభక్తునిపేరు కొందరు రాజబక్షీ మరికొందరు బాగ్‌సవార్‌యని చెప్పచుందురు. ఇదేవిధముగా ఆయన కులగోత్రములనుగురించి కొందరు హిందువనియు మరికొందరు మహమ్మదీయుడనియు చెప్పుచుందురు. ఏదిఎటులుండినను ప్రస్తుతపు గోరీనిబట్టి మహమ్మదీయుడనియే విదితమగుచున్నది. యాత్రికులందరు స్వామివారికి దర్శించుటకుముందు ఈమహానుభావుని ప్రప్రథమమున దర్శించుచుందురు. ఇందుకు కారణంబేమని విచారించగా స్వామివారి ఆజ్ఞయిటులఉన్నదని చెప్పినారు.

స్వామివారి సన్నిధిన మరియు ఈమహానుభావుని సన్నిధిన ఒకేసమయమందు ఏపేట ఇక్కటులు ఇబ్బందులు మతవైషమ్యములు లేకుండా పూజా విధానములు జరుగుచుండును.

చూచితివా మన మహాఘనతవహించిననిజాం ప్రభువరేణ్యుని ప్రభుత్వములో హిందు మహమ్మదీయులు పరస్పరప్రేమ మరి సోదరభావముచే మెలంగుచుందురని లోకోక్తియేకాక శ్రీవారి పితామహులకాలమునుండి ఈ రీతిగా జరుగుచున్నదని చెప్పుటకు ఇదియొకనిదర్శనము. హిందు మహమ్మదీయులయందుండు ప్రేమాతిశయము, సోదరభావము మనకు వారసత్వపుహక్కుగా దొరకినది. ఇప్పుడు ఇట్టిహక్కును పోగొట్టుకొనినయెడల పరస్పరానురాగము గోల్పోవుటయేకాక ఇతరులచే నిందింపబడినవారమగుదుము.

వ్యాసమును సంక్షిప్తముగా వ్రాయదలంచితిని. ఇతరవిషయములు చెప్పదలంచినవి అనేకములుగలవు. అయినను ఒకవిషయము మాత్రముచెప్పి ముగించెదను. నేను పోయిన సమయములో శాలిబండ ఆంధ్ర పాఠశాల బాలికలు అచటికివచ్చియుండిరి. అందరు ౧౨-౧౫ సంవత్సరముల వయస్సుగలవారు. లేక అంతకుతక్కువగానే ఉన్నవారు. అట్టిబాలికలలో ముగ్గురుబాలికలు ప్రదర్శించిన కత్తిసాము, కర్రత్రిప్పుడు మొదలగునవి అత్యాశ్చర్యము కలిగించినవి. వీరికి ఇట్టివిద్య నేర్పినవారు బుచ్చయ్యశాస్త్రిగారు. వీరు గోషామహల్‌కుంటలో ఉంటారని మరియు ప్రతిదినము శాలిబండకువచ్చి ఉచితముగా విద్య నేర్పుచున్నారని విన్నాడను. ఇదిగొప్ప సంతోషకరమైనవార్త. ఇందుకు శాస్త్రిగారు పూజనీయులు. మనలో ఇటువంటిమహాశయులు మరికొందరు తమవిద్య పైపు జ్ఞాతిశయములను చాలబాలికల మేలుకొరకు ఉపయోగించినచో చాలా బాగుండెడిది. ఇంతటితో విరమించుచున్నాను.

---



# సికిందరాబాద అల్లరుల అభియోగము

## మురాఫా ఫలితము

సికిందరాబాదు అల్లరికి సంబంధించిన అభియోగము సెషనుకోర్టులో జరుగుట, దానిమురాఫా రెసిడెంటుకోర్టులో జరుగుట అందరికి తెలిసినవిషయమే.

రెసిడెంటుకోర్టులో అడిషనల్ జడ్జిగానున్న మిస్టర్ హామీల్‌గారు నేరస్థుల మురాఫాను నామంజూరుచేయుచు న్యాయస్థానపు తీర్పును బలపరచినారు.

సెషన్ తీర్పు ఇట్లుండెను:—

"ఫకీరా మనుష్యుని చంపినందుకును, అల్లరి చేసినందుకును ౭ ఏండ్ల కఠినశిక్ష. మరణశిక్ష.

శంకరు అల్లరిలో ఆయుధము ఉంచినందులకు ౨౪ ఏండ్లకఠినశిక్ష, రూ ౫౦౦ జుర్మానా; జుర్మానా చెల్లించనిచో ౬ మాసములకఠినశిక్ష.

నరహరికి ౨ ఏండ్లకఠినశిక్ష రూ ౧౦౦ జుర్మానాగాని ౨ మాసములకఠినశిక్షగాని.

లింగయ్యకు అల్లరిచేసిననేరముపై ౧౮ మాసములకఠినశిక్ష, రూ ౫౦౦ జుర్మానా లేనిచో ౬ మాసములకఠినశిక్ష."

అడిషనల్ జడ్జికోర్టులో, నేరస్థులపక్షమున మద్రాసులోని విఖ్యాతబ్యారిష్టరగు మిస్టర్ నార్టన్‌గ్రాంటుగారు, మిస్టర్ టి.యం కస్తూరి అయ్యంగారును, స్థానిక న్యాయవాదులును వాదనలోపాల్గొనిరి.

గ్రాంటుగారు వాదించుచు, "సెషన్‌తీర్పు న్యాయమైనదిగాలేదు. న్యాయస్థానము సలపరిశీలనమైన చేయలేదు. నియమానుసారముగా లేనిసాక్షులపైననే ఆధారపడి తీర్పుచెప్పెను. జి. వసంతరావు, శ్రీనివాసరావుల సాక్ష్యములోని వ్యతిరేకము గమనింపబడలేదు. దానికి ప్రాముఖ్యతగూడా ఇవ్వలేదు. చచ్చినవాని కుస్తులపై ఇంతతీవ్రదృష్టివేసియు, న్యాయస్థానములో వాటిని తెప్పింపబడలేదు. శవపరీక్ష గూడా జరుగలేదు. మెడికల్‌సాక్ష్యముగూడ ఏమియు తెలుపలేదు. అట్టిపరిస్థితిగలఫకీరాకు మరణశిక్ష విధించబడెను" అనిరి. రాజారాం అయ్యరు, సర్కారుపైరవికారు సెషన్‌తీర్పుకు అనుకూలముగా వాదించిరి. అంతజడ్జిగారును ఉభయపక్ష న్యాయవాదులు సలపరిశీలనము చేసిరి. ఆపైతీర్పు చెప్పబడెను.

---

ఆంధ్రులకు
20 లక్షల నిజాం రాష్ట్రాంధ్రుల అభివృద్ధికి మహోపకారకము గోలకొండపత్రికా పోషకులు.

# గోలకొండపత్రిక

**GOLKONDA PATRIKA**

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the only Telugu Newspaper for H.E.H. The Nizams Dominions.

వర్తకులకు
నిజాం రాష్ట్రమునందలి ఆంధ్రులతో మీ వర్తకాభివృద్ధికి సాధనమేది? గోలకొండ పత్రికలో ప్రకటనము.

**Vol. 10.** | **wednesday 22—1—1936** | **No. 71**

హిందూదేశము వ్యవసాయము ముఖ్యవృత్తిగాగల దేశము. హిందూదేశీయులు, జీవనోపాధికై ఇతరదేశములపై ఆధారపడవలసినవారు లేరు. ప్రతిశత [నూటికి ఎనుబదిమంది] వ్యవసాయము ముఖ్యవృత్తిగా గలిగియున్నారు. మిగతా యిరువది మందియు వ్యవసాయదారులపై ఆధారపడి యితరవృత్తులచే జీవించువారలు కోమటి, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, మొదలగువృత్తులయం దున్నారు.

పూర్వకాలమునందు హిందువులు పరస్పర సహకారముతో సుఖముగా జీవయాత్ర గడుపు నిమిత్తము వృత్తివిభజన చేసినట్లు చరిత్రనువిమర్శనదృష్టితో పరికించిన బోధపడగలదు. ఒక వృత్తిని వంశపారంపర్యముగా అవలంబించిన ప్రత్యేకనిపుణతయు, సులువుగా బోధపడ్డ జ్ఞానము మార్గమున ఉండునని తలంచినటుల కాన్పించును. వైద్యవృత్తిచేయువాడు తన కుమారునికి చిన్నతనమునుంచియే వైద్యశాస్త్ర బోధించుటయు, కుమారుడు తనతండ్రివద్ద వైద్యరహస్యములను గ్రహించుటయు, ప్రతినిత్యము తన యింటికివచ్చు రోగుల రోగ లక్షణముల తెలుసుకొనుటయు ఈప్రకారము తండ్రి పెద్దవాడగువరకు కుమారుడు తండ్రినిమించిన వైద్యుడగుటయు ఉండెడిది. వృత్తివిభజనవలన ప్రతివారును తమతమవృత్తులయందు సంపూర్ణజ్ఞానము సంపాదించుకొనుచుండిరి.

వృత్తులు నశించుటచేతను, వృత్తివిభజనకొరకు నిర్ణయింపబడిన వర్ణములు, నేడు దైవనిర్మితములను భ్రాంతికిలోనై, వర్ణాంతర వివాహములు పనికిరావనియు, మతవిరుద్ధమనియు తలంచబడుచున్నందువలన అభివృద్ధికిఆటకట్టబడినది.

ప్రభుత్వము విదేశీయమగుటచేతను, మరియు ధనికవర్గమునకు చేరినదగుటచేతను పరిపాలనకర్తలు "భారతీయ రైతు" భరింపలేక కృంగిపోవుచున్నాడు. పన్నులభారము వలన, వ్యవసాయవృత్తి పూటగ్రాసమునకుకూడ గిట్టుటలేదు. కాన గ్రామస్థులు ముఖ్యవృత్తియైన వ్యవసాయవృత్తిమాని, సేవకవృత్తికై దేవులాడుచు పట్టణములయందలి యధికారుల కనుసన్నల మెలంగ చూచుచుండుటవలన గ్రామములు పాడుపడియున్నవి.

చీమలికొని బ్రహ్మపర్యంతము సకలజీవరాసులకొరకు ఈప్రపంచము భగవంతునిచేప్రసాదింపబడినది. మానవుడు స్వార్థపరుడై, బలవంతుడేరాజను సిద్ధాంతముకల్పించి బలహీనుల పీడించి హింసించి, ఇట్టికార్యములయందుతనకు తోడ్పడినవారలు తానుకలిసి ఈ భూమిని పంచుకొనిరి. వీరేచక్రవర్తులు, రాజులు, జమీందారులు, అగ్రహారీకులునై యున్నారు. గ్రామములలోని భూమియంతయు, ఈధనికవర్గము క్రిందనున్నది. వీరలు విలాసపురుషులై తిరుగుచు, దివ్యసౌధములలో హంసతూలికాతల్పముల పవ్వళించుచు. ఎల్లప్పుడు తమ మోటారులు తమసినిమాలు, తమ సౌఖ్యములు తలంచుచుందురు. ఇట్టివారిస్వాధీనములో వేలకొలది యెకరముల భూమియుండును. పాపము! బీదరైతు ఎండనక, వాననక, రాత్రింబగలు భేదంలేకుండా కష్టించి పండించినఫలసాయము ఈ ధనికవర్గ భోగములకుచాలక వారు బీదరైతును పీడించుచుందురు. భూమిగల ధనవంతుడు తన గ్రామమునందే నివసించి తనతోడి మానవుల కష్టసుఖముల తెలుసుకొనుచూ, వారివలనను తనవలనవారు పరస్పర సహాయముతో జీవయాత్రగడుపవలయునను బుద్ధియుండిన ఈ అధఃపతనము ఉండెడిదికాదు. స్వయముగా కష్టించి వ్యవసాయము చేయువానికి మాత్రమే భూమియుండవలెనను నియమము లేకపోవుట గ్రామముల నేటి కష్టావస్థకు రెండవ కారణము.

## గ్రామస్థితి బాగుపరచుటకు కొన్ని సూచనలు

వ్యాసకర్త

**జానపాటి సత్యనారాయణగారు**

ప్రధానవృత్తియైన వ్యవసాయవృత్తి లాభదాయకము కాకపోవుటచే, యితరవృత్తులచే వ్యవసాయదారుల నాశ్రయించి జీవించు కుటుంబములవారుకూడ నిరుద్యోగులై, నానాటికి పల్లెలపాడు పెట్టి పట్టణము చేరుచున్నారు. గృహపరిశ్రమలు నశించుట గ్రామముల నేటిస్థితికి మూడవకారణము. నాటి ఆంధ్ర మగ్గములు మూలబడినవి, నూనె గానుగలు రూపుమాసినవి, కొలిమిలు పనికిమాలినవాయెను. స్టీలుమోలు, యినుపముక్కలు, గాజుపెంకులు, వెండిపెట్టిన [పింగాణి] మట్టిపాత్రలు గృహము లలంకరించినవి. విస్తరాకుల [ఆకుగిన్నెల] స్థానములకు బదులు పెండిపళ్లెలు, రోళ్ళు రోకళ్లకు బదులు బియ్యపుగిర్నీలు, నూనెగానుగలకు బదులు, నూనెమరలు వెలసినవి. ఏమి కాలమోగాని హిందూదేశీయులకు బుద్ధిమాంద్యము హెచ్చినది. ఇనుము మాత్రమే పండుచున్న విదేశీయులు దానినెట్లైన నుపయోగించుకొనిగాని గత్యంతరములేక అన్ని సామాగ్రులును యినుముతో చేసుకొనుచుండ, మనదేశమునకు కేవలము నిరర్థకమైన ఇనుపసామానుల దిగుమతిచేసుకొనుటలో విదేశీయులకన్న దేశీయులే అధికోత్సాహముతో నిరుత్సాహములేకుండ విదేశీయుల ఏజెంట్లవలె పాటుపడుచుండుటకంటె విచిత్రమేమి కలదు? ప్రతిగ్రామమునందు పిండి విసురుకొనుటకు రాళ్లు గలవు, బియ్యము దంచుకొనుటకు రోళ్లురోకళ్లు కలవు, వస్త్రములు నేసుకొనుటకు మగ్గములుగలవు. వడుకుకొనుటకు రాట్నములు గలవు. వీటినన్నిటిని తయారుచేయువారు ప్రతిగ్రామమునకొక గ్రామములో లభింపగలరు. భోగపరాయణులగు పట్టణవాసులు మిషనుల నుపయోగించిన నుపయోగించుదురుగాక! తాచెడ్డకోతి వనమెల్లచెరచె నన్నట్లు తాముచెడుటయేగాక గ్రామవాసుల కూడచెడగొట్టుటేల? రెండుమూడు పాయలరాట్నముతో కావలసినన్ని వస్త్రముల తయారుచేసుకొను నవకాశముండ లక్షలు విదేశములకంపి యినుపముక్కల దిగుమతియేల? అడవులు పచ్చిగా గలిగి కావలయునంత కట్టె దొరకుచుండ మరనాగళ్లెందుకు? ఈప్రకారము గృహపరిశ్రమలు నశించుట మూడవ కారణమని పైన తెల్పియుంటిని.

వ్యవసాయవృత్తి లాభదాయకము కాకపోవుటవలనను, గృహపరిశ్రమలు నశించుటవలనను, గ్రామవాసులదృష్టి ప్రభుత్వసేవవంక మరలినది. ప్రభుత్వోద్యోగములకొరకు అర్హత సంపాదించుట నిమిత్తమొక విద్యావిధానము ప్రభుత్వముచే నిర్ణయింపబడి, ఆవిధానమునందు తేర్గినవారికి మాత్రమే యుద్యోగములులభించును అనకలిగింపబడుటచే గ్రామస్థులందరు పట్టణముల కెగబ్రాక మొదలిడిరి. దీనితో గ్రామశిథిలము పూర్తియైనది.

నేటి విద్యావిధానమునుగూర్చి విపులముగా చర్చించుటకు స్థలసంకోచముచే విరమింపవలసియున్నది. మరొకవ్యాసమునందు చర్చింతును. పాశ్చాత్యులు మనదేశములో ఏర్పాటుచేసిన విద్యావిధానము మనలసర్వవిధముల నధోగతిపాలుచేసినదని నానిశ్చితాభిప్రాయము. ఆత్మగౌరవము నశించినది, దేశాభిమానము సన్నగిల్లినది. విద్యయనగా ప్రభుత్వడిగ్రీల సంపాదించుటయని భ్రమపడక విద్య జ్ఞానము ప్రసాదించునదిగా యుండవలెను.

నేటిగ్రామముల దుస్థితికి కారణములు తెల్పితినిగదా! ఇకప్రస్తుతపరిస్థితిని మెరుగుచేయవలెనో విచారింతము. వ్యవసాయము ప్రధానవృత్తిగాన యువకులదృష్టి వ్యవసాయపరిశ్రమవంక మరలునట్లు చేయవలెను. ప్రభుత్వమువారు వ్యవసాయము చేయదలచు కుటుంబములకు అయిదు ఎకరములవంతున యివ్వవలెను. సంవత్సరము నకు యకరము 1కి రు 2-0-0 లేక రు 3-0-0 మించినశిస్తు యుండకూడదు. అమ్మకొనుటకు, తనఖా పెట్టుకొనుటకు హక్కులుండకూడదు. పన్నులభారము తగ్గించి, సినిమాలు, మోటారులు, గ్రామఫోనులు, మొదలగు విలాసవస్తువులపై పన్నులువేయుట న్యాయము. పీదగ్రామమునందలి రైతు జీవనోపాధికి మాత్రమే సంపాదించుకొనగలుగుచున్నాడు. పట్టణవాసులగు ధనవంతుల భోగములకు హద్దులేకుండయున్నది. వారివద్దనుంచి హెచ్చు పన్నులు వసూలుచేసినవారు చెల్లించుటయు క్రమేణ స్వక్రమ మార్గమునకు తెలుచుటయుజరుగును.

గ్రామములయందు నేడు రైతు దుర్భర ఋణబాధచే కృంగిపోవుచున్నాడు. ఋణబాధకంటె బాధ దుర్భరమైనదిగదా? శారీరక, మానసికశక్తులు నశించుచున్నవి. కాన వెంటనే ఋణవిముక్తి సాధనల నరయవలెను. స్వతంత్రదేశముల నవలంబించుచున్న విధానముప్రకారము రైతుఋణమునంతయు ప్రభుత్వము చెల్లించి, ఆఋణమొత్తమును దీర్ఘకాలవాయిదాలు అనగానూరు సంవత్సరములవాయిదాలమీద చెల్లించునట్లు నిర్ణయించి, బాకీతీరువరకు రైతుతన తాలూకుయిల్లుగాని భూమినివిక్రయించుకొనుటకు గాని తనఖాయుంచుటకుగాని హక్కులేకుండ చేయవలెను. తద్వారా రైతు దుబారాఖర్చులనిమిత్తం షాహుకార్లవద్ద హెచ్చుమిత్తీలకు అప్పుచేయు అవకాశము తప్పిపోవును.

గ్రామస్థుల హీనస్థితికితెచ్చి వశీకృతచేయునది త్రాగుడు దురభ్యాసము. దీనిని ఆపుదలచేయుటకు ఒకటేమార్గము కలదు. ప్రభుత్వము కల్లుసారాయిబజారాలు ఆపుదల చేయవలెను. ఈసూచనను ప్రభుత్వమువారుఆచరణలోపెట్టుటకు సంసిద్ధులుకారని నాకుతెలియకపోలేదు. అట్లు లేనియెడల సామాన్య జనుల అందుబాటులో లేకుండునట్లు ధరలు హెచ్చించుటయు, దూరుకెలుపల నియమిత కాలములందు విక్రయించునట్లు కట్టుబాటుచేయుటయుఅత్యావసరము.

గ్రామపంచాయితీలు స్థాపించవలెను. న్యాయము ప్రసాదించుటకు నేడు అగుచున్నంత వ్యయప్రయాసలు పూర్వము లేకుండినట్లు చరిత్రవలన తెలియుచున్నది. గ్రామస్థులు పంచాయితీదారులనెన్నుకొని వారిద్వారా తమ తమ తగాదాలను పరిష్కరించుకొనుచుండిరి. పంచాయితీ సంఘమువారు తగాదాదారుల గుణగణములు తగాదాలవివరములు స్వయముగా నెరిగియుండుటవలన న్యాయము ప్రసాదించుట బహు సులభముగా నుండెడిది. నేడో, కోర్టుఫీజులు, న్యాయవాదుల ఖర్చులు, హెచ్చుచున్నవి. కాన సాధ్యమైనంత త్వరలో ఈ విధానము కట్టిపెట్టి పంచాయితీ సంఘములు స్థాపించవలెను. తద్వారా, గ్రామస్థుల విరోధములుతగ్గి పరస్పర స్నేహభావములు ఏర్పడును. కక్షసాధించు నిమిత్తము వకీళ్లయొక్కయు, ప్రవేటు సలహాదారుల, యొక్కయు [పైరవికార్లు]దుర్బోధలకులోనై పాడుపడుచున్న బీదరైతుకుటుంబములురక్షింపబడును.

వైద్యసహాయము అత్యావసరము. రోగులు, రోగములు పట్టణములందేగాక పల్లెలయందుకూడ గలవనియు, ప్రభుత్వ బొక్కసమునకు, పట్టణవాసికన్న, పల్లెబీదరైతు హెచ్చుగానింపుచున్నాడను విషయము ప్రభుత్వమునకు తెలియనిదికాదు. సకాలమున వైద్యసహాయము లేకపోవుటవలన, మరణసంఖ్య తగ్గకున్ననూ, ప్రజలు అజ్ఞానమువలన, నోరులేని గొర్రెలవలెనున్న, కోట్లచచ్చుట మాత్రమయథాప్రకారం సాగుచున్నది. ఆరోగ్య మార్గములను మ్యాజిక్ లాంతరు సహాయమున బోధించుటయు, ప్రతిపల్లెయందును వైద్యశాలల నేర్పర్చుట అవసరము. అసాధ్యమని తలంచుచో ఒక ఉపాయము కలదు. ప్రతి పల్లెయందును కొద్దియో గొప్పయో నేర్చిన ఆయుర్వేద వైద్యులు కలరు. వారలకు కొన్ని పరీక్షలు నిర్ణయించి అందుత్తీర్ణులగువారికి ప్రతి సంవత్సరము కొంత గ్రాంటుయిచ్చు పద్ధతిని గ్రామములో ఏర్పాటు చేయవలెను. ఈ పద్ధతివలన వ్యయము చాలతగ్గును.

పైనయిదు పేరాలయందు తెల్పినవిషయము ప్రభుత్వము చేయవలసిన విధికృత్యములైయున్నవి. పాఠశాలలు, టప్పాకానాలు మొదలైన సౌకర్యముల కూడ గ్రామవాసులకు ఏర్పర్చవలసి యున్నది. కాని ప్రభుత్వము తనంతట తాను చేయునని యెదురు చూచుటవలన ప్రయోజనము లేదు. అడుగనిదె అమ్మకూడ పెట్టదు. ప్రజలుతమ అవసరములకు ప్రభుత్వముతో మొరబెట్టుకొనుటకు కూడ అశక్తులై యున్నారు. కాన ప్రజానాయకులు గ్రామవాసులయందు ప్రబోధము కల్గించవలెను. ప్రజానాయకులు మున్ముందు కార్యరంగమున దుమికి, ప్రత్యక్షముగా తాము ఆచరణయందుంచి తద్వారా కలుగు సదుపాయములు ప్రభుత్వమునకు విన్నవము చేయవలెను.

Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad. Editor K. Balakrishna Reddy.